# పరిచయం



పేరు : వారణాసి సూర్యకుమారి

జననం : 1941

తల్లిదండ్రులు : భాగవతి సుబ్బారావు గారు, సత్యవతి గారు

జన్మస్థలం : ద్రాక్షారామం

భర్త : శ్రీ వారణాసి లక్ష్మీజయప్రదన్ (మేజర్)

పిల్లలు : నలుగురు

పెద్ద అమ్మాయి : డా॥ శోభ - పెద్దల్లుడు - డా॥ బి.డి.సి.ఎస్. ప్రసాద్

చిన్న అమ్మాయి : డా॥ శైలజ - చిన్నల్లుడు - డా॥ ఎస్.వి. రమణ

పెద్ద అబ్బాయి : డా॥ పినాకపాణి - కోడలు - డా॥ నాగలక్ష్మి

చిన్న అబ్బాయి : డా॥ చక్రపాణి - కోడలు - శ్రీదేవి M.Tech., MS

మనుమలు : వంశీ, వరుణ్

మనుమరాండ్రు : నీలోత్పల, మనోజ్ఞ, వర్షిణి, హార్షిణి

రచనలు : గోవింద శతకము, శ్రీరామ కథాసుధ, సూర్య కిరణాలు, కవితారామం (పద్య కవితలు), కథల సంపుటి, 'మానినీ మానసం' వేణునాదం (ద్విపద కావ్యం), ఆదర్శరామా, సూక్తి మంజరి (ఛందములు)

నవలలు : (అముద్రితాలు)

పురస్కారం : 'ఆంధ్ర సారస్వత సమితి' ఉగాది పురస్కారం, పద్య రచనకు 2009లో 'సాహితీ మిత్రుల సంస్థ' తరఫున మిత్రులందరు 'కొత్తపూలు' కవితల సంకలనం అంకితం యివ్వడం,
2011 లో ప్రభుత్వ ఉగాది పురస్కారం
'మన బందరు' పుస్తకమునకు గౌరవ సంపాదకత్వం వహించుట.

ఆకాంక్ష : ఇంకా ఎన్నో ఎన్నెన్నో (వ్రాయాలని)

1. ఆంధ్ర సారస్వత సమితి, సాహితీ మిత్రులు, ఉదయ నడక మండలిలో శాశ్వత సభ్యత్వం.
2. ఉదయ నడక మహిళా విభాగం ప్రెసిడెంటుగా, మహిళా మండలిలో ప్రెసిడెంట్‌గా సేవా కార్యక్రమాలు నిర్వహించడం

వి బందరు కళ్యాణి ప్రెస్, మచిలీపట్నం. Ph : 223404

# తెలుగు భాష - సంస్కృతి











వారణాసి సూర్యకుమారి

# తెలుగు భాష - సంస్కృతి

వారణాసి సూర్యకుమారి



సాహితీ మిత్రులు

మచిలీపట్నం

తెలుగు భాష - సంస్కృతి

పద్యాలు


రచన :

**శ్రీమతి వారణాసి సూర్యకుమారి**

21-562-3, పరాసుపేట,

మచిలీపట్నం - 521 001



హక్కులు : కవయిత్రి

ప్రచురణ : జూన్ 2013

ప్రచురణ సంఖ్య : 90

వెల : రూ. 30/-

ప్రతులకు :

**శ్రీమతి వారణాసి సూర్యకుమారి**

21-562-3, పరాసుపేట, మచిలీపట్నం-521 001

ఫోన్ : 08672 - 251741

ముద్రణ :

బందరు కళ్యాణి ప్రెస్, మచిలీపట్నం-1




# సూరి వారి తెలుగు దారి

శ్రీమతి వారణాసి సూర్యకుమారి గారికి తెలుగుభాష అన్నా, తెలుగు సంస్కృతి అన్నా అనంతమైన మక్కువ. వారి తెలుగు భాషాభిమానానికి దేశభక్తితో మంచి అనుబంధం ఉంది. అందుకే "జై విజయ పతాకా" అనే పద్య పుష్పంతో ముందుగా దేశమాతను పూజించారు. తెలుగు భాష, సంస్కృతి గురించి వారు రాసిన ఈ పద్యాల సంపుటిని తెలుగు తల్లికే అంకితం ఇవ్వటం అభినందనీయం, ఆదర్శం కూడా. కవయిత్రి అనేక పద్యాలలో తెలుగు తల్లిని తెలుగు వారి మనసులలో వివిధ కాంతులతో వెలిగింపచేసారు మా "సూరి" వారు. మా "సాహితీ మిత్రులు" సూర్యకుమారి గారిని "సూరి" అని అభిమానంతో పిలుచుకుంటాం. సూర్యకుమారి అనే పేరులోని మొదటి, చివరి అక్షరాలు కలిపి అలా పిలుచుకుంటాం.

తెలుగు భాష, సంస్కృతి గురించి రాసిన పద్యాలలో చక్కని కవిత్వం కూడా పరిమళించటం విశేషం. ఉదాహరణకు ఈ సంపుటిలోని ముప్పయ్ రెండవ పద్యం చదవండి.

"మా" యని తెలుగుపై మాయని మమతతో
పట్టు సాధించుట ప్రగతి యగును,
వేచి చూడక ముందె "వేచి" కూరలు పెట్టు
అమ్మ వంటిది భాష కమ్మదనము,
కాచిన నేతికై "కాచి"న వారిగా
మంచి రచనలను కాంచ నగును,
ఈవల తెమ్మన "ఈ" వల తెమ్మను
అర్థము వచ్చుటే అద్భుతమ్ము....

ఇలాంటి కమ్మని పద్యాలు ఈ సంపుటిలో చాలా ఉన్నాయి. తెలుగు సాహిత్య వైభవం గురించి, తెలుగు లిపి గురించి, తెలుగు చరిత్ర గురించి, తెలుగు కవులను గురించి.... గొప్పగా అభివర్ణించారు. తెలుగు పండుగల సాంస్కృతిక విశేషాల్ని ఈ తరం వారికి గుర్తు చేస్తున్నారు. ఇది ఈనాడు చారిత్రక అవసరం. తెలుగు వెలుగుల కోసం విశేషంగా కృషి చేస్తున్న అధికార

భాషా సంఘం అధ్యక్షులు శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారు, ఇంకా ఎందరో భాషోద్యమకారులను ప్రస్తుతించారు.

సూర్యకుమారి గారు మా "సాహితీ మిత్రులు" సంస్థ కార్యవర్గ సభ్యులు కావటం మా అదృష్టం. పెద్ద వయస్సులో వారి ఆరోగ్య రహస్యం వారు సాహిత్య సృజన చేస్తూ ఉండటమే. నిరంతరం రచనలు చేయటమే వారి ధ్యాస, శ్వాస కూడా. "తెలుగు భాష - సంస్కృతి" అనే ఈ పద్య సంపుటిని "సాహితీ మిత్రులు" సంస్థ ప్రచురణగా వెలువరిస్తున్నందుకు సంస్థ పక్షాన కూడా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

**డా॥ రావి రంగారావు**
వ్యవస్థాపక అధ్యక్షులు,
"సాహితీమిత్రులు", మచిలీపట్నం
Cell : 9247581825
email id : raavirangarao@gmail.com

మచిలీపట్నం
15-6-2013







## శుభాకాంక్షలు

ఈ రెండువేల పదమూడును తెలుగు భాషా సంస్కృతుల వికాస సంవత్సరంగా మనం జరుపుకుంటున్న సందర్భంలో శ్రీమతి వారణాసి సూర్యకుమారిగారు "తెలుగుభాష - సంస్కృతి" అనే పేరుతో పద్యసంపుటి తీసుకురావటం ఎంతో ఔచిత్య భరితం. తెలుగు భాషోద్యమ దీప్తిని, భాషా స్ఫూర్తిని కలిగిస్తున్నాయి సూర్యకుమారి గారి పద్యాలు. తెలుగు భాషను ప్రపంచ భాషగా రూపొందించే కార్యాచరణకు ఇలాంటి పుస్తకాలు మంచి స్ఫూర్తిని ఇస్తాయి. నేటి తరంలో తెలుగు భాషా సాహితీ సాంస్కృతిక వికాసం కోసం మనం కృషిచేయాలి. ఇందుకోసం తపిస్తున్న శ్రీమతి వారణాసి వారిని అభినందిస్తున్నాను. వారింకా ఈ దిశలో అనేక కావ్యాలు రాయాలని నా శుభాకాంక్షలు.

**మండలి బుద్ధప్రసాద్**
గౌరవ అధ్యక్షులు
ప్రపంచ తెలుగు రచయితల సంఘం

# అభినందన మందారమాల

పూవుకు తావిలా
భాషకు సంస్కృతిక అవినాభావసంబంధం
పేరుకు గుణంలా
పద్యానికి కవిత్వానికి సహచర సంబంధం

పద్యం లేకపోతే
తెలుగు సంస్కృతిలేదు,
సేద్యం లేకపోతే
తెలుగువాడికి బ్రతుకులేదు.

వారణాసి సూర్యకుమారి అనగానే
ఇంటిపేరులోని దివ్యభావం,
వారి పేరులోని కాంతిధామం,
మన మనసుల నిండా కవితారామం...
సాహితీమిత్రుల ప్రచురణ
మిత్రులు అనగానే సూర్యుళ్ళు గుర్తొస్తారు
ఇది సాహితీమిత్రుల ప్రచురణ...
ఈ పుస్తకం సూర్యచైతన్యప్రేరణ...

సూర్యకుమారిగారి
ఈ గ్రంథావిష్కరణవేళ
వారి సాహిత్యకృషికి
నా అభినందన మందారమాల...

**- గుత్తికొండ సుబ్బారావు**
అధ్యక్షులు
కృష్ణాజిల్లా రచయితల సంఘం, మచిలీపట్నం



# మనోగతం

తెలుగు పద్యరచన చేయ తెలుపమంచు
శారదమ్మను స్మరియించి సాహసముగ
'అమ్మ' యని ఆర్తిగ పిలువ నమ్మకముగ
పలుకు శీఘ్రమ్మదియె నాథు భాగ్యమగును

'తెలుగుభాషా – సంస్కృతి' నుద్దేశించి కవితాపఠనం 'ఉగాది పురస్కారముల సందర్భముగా 'ఆంధ్ర సారస్వత సమితి' వారు నిర్వ హించగా అప్పుడు కొన్ని వ్రాసి బహుమతిని అందుకోడం జరిగింది. అలా అనుకోకుండా ఈ పుస్తకం రూపు దాల్చింది.

'తెలుగు భాష' పై యెనలేని మమకారం పద్యరచన మీద తులలేని ఆసక్తితో రచనలు చేయడం, ఆవాగ్దేవి కృపవల్ల నిరంతర కృషిగా సాగుతోంది. అది నాకు ఎంతో సంతృప్తిని, సంతోషాన్ని కలుగజేస్తోంది.

అందుకు మా పిల్లల ప్రోత్సాహం చాలా ఉంది. మాయింట్లో అందరూ తెలుగు భాషాభిమానులే! మా పిల్లలవరకూ అది సాగినా భావిపౌరులైన మా మనుమలు దగ్గరికి వచ్చేసరికి తగ్గిపోతోంది. ఈ సమస్య బహుశః ప్రతీయింటా తలెత్తవచ్చు. మా అబ్బాయిలిద్దరూ ఒకరు అమెరికా, ఒకరు హిందీ బోధన ఉన్న జార్ఖండ్‌లో ఉండడంతో వాళ్ళకి చదువుట వ్రాయుట కూడా రాదు. కానీ విని కంఠస్థం చేసిన పద్యాలు శ్లోకాలు పలుకుతారు, చిలకల్లా మాట్లాడుతారు చక్కగా. నా రచనలు వాళ్ళు చదువలేరు కదా! ఈ ఆలోచన నన్ను చాలా బాధిస్తోంది. ఇంట్లో నేర్పించడానికి తల్లిదండ్రులు కృషిచేసినా తమ తరగతులలోని చదువుతోనే ఆపనితోనే వాళ్ళకి సమయంచాలక శ్రద్ధ పట్టలేకపోతున్నారు.

'ఆంధ్రా'లో చదువుకుంటున్న మరో మనుమరాండ్రు మాత్రమే నేను రాసినవి ఎప్పుడైనా చదివి 'శీర్షిక' లాంటి విషయాల్లో సలహా లిస్తుంటారు.

అందుకే కనీసం ఆంధ్రాలో చదువుకుంటున్న పిల్లలైనా తెలుగు పట్ల శ్రద్ధచూపమని నా కోరిక. చెన్నైలో చదివిన మన తెలుగువారు

కూడా తమిళంలో వ్రాసి, చదివి, మాట్లాడగలుగుతున్నారు. ఆవిధంగా మన మాతృభాష తెలుగును నిర్బంధంగానైనా చదివించాలి.

అడిగిన వెంటనే ముందు మాటలు వ్రాసియిచ్చిన గౌరవనీయులు తెలుగు భాషా అధ్యక్షులు శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారికి గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

నా రచనలకు ఎంతో ప్రోత్సాహమందిస్తూ 'సాహితీ మిత్రులు' సంస్థ ద్వారా ఆవిష్కరింపచేస్తున్న డా॥ రావి రంగారావుగారు నాపట్ల చాలా అభిమానం కలిగినవారు. సంస్థలో అందరికన్నా పెద్దదాన్ని కూడా కావడంవల్ల అందరూ నన్ను 'సూరి'ని చేశారు. 'సూరి' అంటే పండితుడని అర్థం కనుక నాకు చాలా సంతోషంగా ఉంది. వారికి నా కృతజ్ఞతలు.

మీరు ముందు మాటలు వ్రాయవలసినదిగా నేను కోరినప్పుడు ఎంతో ఆప్యాయంగా 'మీరు మెట్లు ఎక్కలేరు, నేనే క్రిందికి వస్తానని చెప్పి వచ్చి ఆదరంగా మాట్లాడి వ్రాసియిచ్చిన మంచిమనస్సున్న వ్యక్తి, కృష్ణాజిల్లా తెలుగు భాషాధ్యక్షులు శ్రీ గుత్తికొండ సుబ్బారావుగారికి నా కృతజ్ఞతలు.

నాకు కావలసిన విధంగా అందంగా పుస్తకం ముద్రించినందులకు కళ్యాణి ప్రెస్ వారికి నా కృతజ్ఞతలు.

ఎప్పటివలె ఈ పుస్తకమును కూడా అందరూ ఆదరించగలరని ఆశిస్తున్నాను.

తే.గీ. వినికిడియు చూపు మందగించినను తలను
మెరయ యోచనా విరిజల్లు కురియ కలము
కాలమంత సద్వినియోగకరముకాగ
తెలుగు భాషకు సేవలందింతు కరము ॥

వారణాసి సూర్యకుమారి



# అంకితం



తే.గీ. తెలుగు గడ్డపై జనియించి తెలుగువ్రాసి
అంకితముచేసి భాషాభిమానమునను
తెలుగుతల్లికి మనసార తెలుపుకొందు
అందుకొమ్మంచు శతకోటి వందనములు

తే.గీ. తెలుగుతల్లికి మల్లెలమాల తెలుగు
తెలుగుతల్లికి కన్నులవెలుగు తెలుగు
తెలుగుతల్లి బిడ్డలకెల్ల నెలవు తెలుగు
తెలుగుతల్లికి ప్రీతిని గొలుపు తెలుగు ॥

వారణాసి సూర్యకుమారి

## జై విజయపతాకా



సీ. వినువీధి నెగురు మా విజయపతాకమా!
ఎదురులేని విధము ఎదలు పొంగ ॥వి॥
మువ్వన్నెలను గూడి ముచ్చటగ నశోక
చక్రముగను ధర్మఛత్ర మనగ ॥వి॥
సామర్థ్యము చూపి సాధించ విజయము
చిరకాలమెగురుమా స్వేచ్ఛగాను ॥వి॥
నెహ్రూజీ, గాంధిజి, నేతాజి ఆత్మలు
తృప్తిగా తిలకించి దీవెన లిడ ॥వి॥
తే.గీ. దేశభక్తి తోడజనులు తేజరిల్లి
జగతి జాతీయజెండాకు శ్రద్ధగాను
వందన సమర్పణను జేసినంతనె మన
దేశమాత సంతసమున తేలియాడు ॥



## తెలుగు భాష - సంస్కృతి



### గణేశా

తే.గీ. కరివదన నిన్ను నమ్మితిన్ కావుమయ్య
వక్రతుండ యోమూషిక వాహనుండ
విఘ్నరాజ! వినాయకా! వేడుకొందు
ఆర్తరక్షాకరా! మమ్ము ఆదుకొమ్ము!



### భారతి

సీ. కచ్ఛపి పాణికి కమలాలయకునివె
శతసహస్రంబగు వందనములు
చదువుల తల్లికి చంపక ఉత్పలమాలల
నల్లి అర్పింతు నుల్లమలర
అవ్విధాత సతికి నర్పణ చేతును
స్వీయరచనలను స్వీకరించ
పూర్ణేందు వదనిని పూజింతు సాహితీ
సేవతో స్థిరప్రజ్ఞ సిద్ధికలుగ
తే.గీ. మాతను మదితలచినంత మాత్రముననె
కదము త్రొక్కును కలమింక కరమునందు
రచన సాగును తృప్తిగ రమ్యముగను
కలలు ఫలియించు భారతి కరుణ వలన ॥

# తెలుగు భాష

సీ. శ్రీవాణి చిందించు చిరుదరహాసమై
బాలసాహిత్యము తళుకులీను
శారదామాత యొసంగు ఆశీస్సులై
పద్యగద్య రచనల్ ప్రణతులందు
భారతి ప్రసరించు కారుణ్యభాగ్యమై
కవితలు ప్రవహించి ఘనత నందు
వాగ్దేవి క్రీగంటి వరమున విలసిల్లు
నాటక సంగీత నాట్యములును

తే.గీ. హంసవాహని కమలాల యనుకొలువగ
కొరత లేకను దీర్చును కోర్కెలన్ని
ఒసగు నక్షరసంపద యొజ్జయగుచు
లలితకళలు ప్రసాదించు లక్షణముగ ॥ 1

సీ. సాహిత్యమనియెడు సంపద ప్రాప్తించ
పూర్వజన్మములోని పుణ్యవరము
భగవతిపావన పాదారవిందమున్
నమ్ముకొన్న కలుగు సుమ్మయశము
ఏ పనిచేసిన నెంతయొ శ్రద్ధగ
విజయము తథ్యము వినుమనిశము
తొలుత విధేయత దొడ్డగ నేర్చిన
ఆధిక్యతయు నబ్బు విధిగ నిజము

తే.గీ. సాటివారిలో సఖ్యత సహనములును
మనము మన భాష యంచను మంచిమాట
ధర్మపథగామి యుత్తమ తత్వమనుచు
తెలిసికొని మసలుకొనుటె తెలివియగును 2



సీ. వాఙ్మయము తెలుగువాసి గాంచినదన్న
వాగ్దేవి యభయమ్ము వలనకాదె
నాలుకపై భాషనర్తించి రాణించ
వాణి వీణియమీటు బాణికాదె
సంగీత రసఝురి సాహిత్యవాహినిన్
ప్రజలు మునిగి తేల భాగ్యమవదె
బహుముఖ ప్రజ్ఞల బహుమతులందుట
కచ్ఛపిధారిణి కరుణకాదె!

తే.గీ. భగవతి నిలిచినంతట బాసటగను
పట్టు సాధించగలరింక భాషయందు
తెలుగుగ్రంథ పఠనమున తెలుసుకొనగ
జ్ఞానసముపార్జనమ్ము సహజమగును 3

సీ. విశ్వభాషలలోన వెలుగు తెలుగు లిపి
సాధించె రెండవ స్థానమనగ
షట్ప్రమాణములను సంపూర్ణతను లిపి
అందమై, ధ్వనియించు నదియునగుట
బ్యాంకాక్ ద్వితీయ ప్రపంచలిపి సదస్సు
పూర్తిగశాశ్వత కీర్తి తెచ్చె
తెలుగుతల్లి సిగను కలికితురాయిగా
తెలుగు యుత్తమలిపి గెలిచె నేడు

తే.గీ. భాషయె మనోగత మెరుకపఱచుటకును
సాధనంబైన లిపి పుట్టె శాశ్వతముగ
భాషను నిలుపు ననె మాడభూషివారు
తెలుగు నేర్చుటయును చాల సులభమనిరి ॥ 4

సీ. వర్ణమాలను నేర్చి వరుసవ్రాసి చదువ
లిపియును ధ్వనియును తెలియు మనకు
ఉత్తమ లిపిగను ఉన్నతస్థానము
పొంద తెలుగువారి పుణ్యఫలము
అచ్చ తెలుగులోని అసలు సొబగులన్ని
అభిరుచికొలదిని అర్థమగును
దొరలు నేర్చి తెలుగు దొడ్డ భాషగ మెచ్చి
పరిపూర్ణులై వారు పరగినారు

తే.గీ. తెలుగున పురాణగ్రంథముల్ కలవు చాల
బాలసాహిత్యమును జానపదములెన్నొ
ఘనతగన్నట్టి చారిత్రకములు కలవు
జ్ఞానసంపద పెరుగును వాని చదువ 5

సీ. పట్టుబట్టి తెలుగుభాష ప్రాధాన్యతన్
పెంచుమార్గములుండె పెక్కుగాను
యాబదిఆరున్న అక్షరములసంఖ్య
తగ్గెనిప్పటికింక తగినవిధము
తెలుగు బోధన పాఠశాలలో తప్పని
సరిచేయగన్ ప్రయోజనమునుండు
సాంకేతికపరము సర్దుబాట్లనుచేయ
సాగు ముందుకు భాష సాకులేక

తే.గీ. తెలుగు నధికారభాషగా తెచ్చినంత
తెలుగు వెలుగులు ప్రసరించు దేశమంత
అమ్మభాషను గలయట్టి కమ్మదనము
తట్టిలేపును సంస్కృతిన్ తప్పకుండ ॥ 6



సీ. తెలివిగ చదివిన తెలుగు మాధ్యమమున
ప్రోత్సహించ ప్రభుత ప్రజలనెపుడు
ఉద్యమంబుగనుండు ఉద్యోగపర్వమ్ము
తెలుగు ఔన్నత్యము తెలియవచ్చు
ప్రాచీన నూతన రచనల పరిశోధ
నలు తెచ్చు గుర్తింపు నాల్గుదెసల
తెలుగును పెద్దలు తెలిపిన పిల్లలు
మన సంస్కృతి నెరిగి మసలుచుంద్రు

తే.గీ. భాషతోబాటు కళలన్ని బాగుగాను
పాఠ్యభాగమ్ము చందము పాఠశాల
లందునను కళాశాలల యందు నేర్ప
తెలుసుకొనగల్గును యువత తెలుగు ఘనత ॥ 7

సీ. భాషయంతర్జాల పద్ధతిన్ విస్తృత
ముగ ప్రచారంబగు ముందుకంటె
తెలుగున న్యాయమూర్తులు తీర్పుచెప్పిన
భాషకు న్యాయము చేసినట్లె
చేవ్రాలు తెలుగులో చేసిన చాలును
భాషపై మమతయు పండినట్లే
చిత్రసీమ చలనచిత్రములకు పేర్లు
తెలుగైన! కీడంత తొలగినట్లె

తే.గీ. తెలుగు వినియోగమున మేలు తెలియునట్లు
ప్రజలలో స్ఫూర్తిని రగులజేసి మాతృ
భాషపై ప్రీతిపెంచిన పల్లవించు
సౌరభమ్ములె అభివృద్ధి కారకములు 8

సీ. భాషను బ్రతికించ భాషాభిమానులు
కలసికట్టుగ కృషిసలుప తగును
అక్షరము మనకు రక్షయగును సుమ్ము
సాహితీ సంస్కృతుల్ సంపదలగు
పదక్రీడలును పెంచు బాలల మేథస్సు
'జోడించు' పదకేళి ఆడినంత
నిర్ణయాత్మకశక్తి వర్ణపరిజ్ఞాన
తార్కికము సృజనాత్మకత కలుగు

తే.గీ. మాతృభాషలో భోదన మనకు వీలు
అక్షరములతో పదములు లక్షణముగ
కూర్చ నేకాగ్రత తెలివి కూడియుండు
జ్ఞానసంపద పెరుగును జ్ఞాపకమును ॥ 9

సీ. భాషయు భావమున్ పరిపుష్టము తెలుగు
పద్యరచన గాంచ అద్భుతమ్ము
దైవప్రసాదమౌ అవధాన ప్రక్రియన్
పాల్గొనుటె తెలుగు ప్రాభవమ్ము
ధారణశక్తిని పూరణనవధాని
చేయును క్లిష్టసమస్యలమ్మ
ఆస్వాదనమ్మున ఆశ్చర్య మాహ్లాద
ముల డోలలూగుటో ముచ్చటమ్మ

తే.గీ. గండపెండేరములు నాటి కవులకందె
బహుమతులు బిరుదులు నిచ్చి ప్రభుత నేటి
కవుల కృషిని మెచ్చుచు వారి కలలు పండ
తగిన ప్రోత్సాహమందించ తగును గాదె ॥ 10



సీ. ఇంటిలో పెద్దలు ఇష్టపూర్వకముగ
తెలుగు నేర్పగజాలు పిల్లలకును
తల్లిపాలను త్రాగు పిల్లలవలె వారు
మాతృభాష విధిగ మాటలాడు
పరభాష నేర్చుట బ్రతుకుట కొరకంచు
తల్లిదండ్రులు చెప్ప తప్పుకాదు
వస్త్రధారణలోను వరలు సంస్కృతి మన
దంచును నుడువుటయు తప్పుకాదు

తే.గీ. సాంప్రదాయబద్ధమగు వస్త్రముల నెంచి
బాల్యమందె నేర్పించిన పద్ధతులను
మొక్కమానుగ నెదిగిన నొక్కరీతి
వంశవృక్షమునకె ఘనయశము వశము ॥ 11

సీ. మాతాపితరులల్లె మాతృభాషను కూడ
కాపాడు బాధ్యత కలదు మనకు!
మనకు గుర్తింపు నిచ్చునది భాషయనంగ
తెలుగు వారమనుచు తెలియగలదు
సుమతి వేమన శతకములు కంఠోపాఠ
మైనచో నెల్లరు జ్ఞానులగును
సుందర తెలుగని శుభమనె శ్రీసుబ్ర
హ్మణ్యభారతివారి పుణ్యమేమొ ॥

ఆ.వె. అమ్మభాష మరచి అమ్మనూ మరచియూ
వరుస బిడ్డలంత వలసపోవ
దిగులు తోడ గుండె పగులదే తల్లికి?
తెలుగు విలువ వారు తెలుసుకొనరె? 12

## వర్ణమాల

తే.గీ. అక్షరమక్షయమ్మగు ఆర్జనమ్ము
ఇల్లువాకిలి సమకూర ఈశుదయను
ఉన్నతాశయసిద్ధియే ఊపిరనగ
ఋక్థమున దురాశయములేక ఋణపడకను
ఎవరితో విరోధమనక ఏకరీతి
ఐకమత్యము నొప్పుచు ఒకరికొకరు
ఓర్మిని సహకరించగ ఔర యనగ
అందరును మెచ్చుచుందును అః యనుచు ॥ 13

తే.గీ. తెలుగు పద్యమున్ ప్రాసయతి నియమములు
తెలుగుభాష విలువలను తెలియజేయు
తెలుగుపద్య సౌరభమున తేలియాడి
సత్కవులను స్మరింతుము సాదరముగ 14

సీ. పాలధారను బోలి జాలువారు తెలుగు
మాటలాడుచునుండ మనసు నిండు
సామెతలు సహజసంపద నలరుచు
భాష వీనులవిందు పరచుచుండు
సంధులును సమాస సహితమై చక్కని
ఛందస్సు లూరించు చందముండు
తలచిన, పలికిన తనువంత పులకించి
మన మాతృభాషపై మమత పెంచు

ఆ.వె. ముందు తరము నాటి ముచ్చటౌ గ్రంథముల్
క్లిష్ట మనెడు వారు యిష్టపడక
అందమైన వాని యర్థమరయలేరు
తెలుగు చదువుకొలది విలువ తెలియు ॥ 15



సీ. భాషలను వనమున్ పరిమళమ్మె తెలుగు
పలుకులు విరులునై వెల్లివిరియ
సంగీత సభలు రసాస్వాదన కలుగు
పాటలన్ తెలుగన్న భక్తి కురియ
సాహిత్య సభలును సంతసించు తెలుగు
ప్రాభవము పెరుగ పాటుపడగ
భాష దేవళమని భావించ మనమంత
తెలుగువాణి యచట నిలిచియుండు

తే.గీ. వెనుక బడితి మంచనెడు వెతనుదీర్చి
తెలుగు భాషోద్ధరణగూర్చి తెలియజెప్పి
ప్రగతి సాధించగలయట్టి పనులుజేయ
తెలుగు తల్లికి వదనమ్ము వెలిగిపోవు ॥ 16

సీ. తెలుగన్న మమతను తెలుపగ జంకేల?
మనభాష మనకెంతొ ఘనముకాద!
ఇప్పుడైన కనులు విప్పగ జాగేల
తెలివిగ మెలగుట మేలుకాద!
కూటికై పరభాష కోరినా మరువక
తెలుగును పలుకుట తెలివికాద
వాడుకభాషగా వాడవాడల యందు
వాడగల్గుట మన తరముకాద

తే.గీ. అరచి అరచి కోయిల గొంతు అరగనట్లు
చెప్పి చెప్పియు విసుగును చెందనట్లు
ప్రజలు శ్రమియించ లభియించు ఫలితమంచు
ప్రతినబూనుటె తక్షణవ్రతముకాద? 17

సీ. బుద్ధప్రసాద్‌గారు బద్ధకంకణులైరి
తెలుగుకు గుర్తింపు తెచ్చుటకును
తెలుగుభాషోద్యమ తేరుసారథి వారు
వాణియు జనవాణి వారితోడు
ఎల్లరు కృషిజేయ నెల్లవేళలయందు
తెలుగు వెలుగు నిండుతేజ మలరు
భాషయందభిలాష భావతరంగిణి
యైన తెలుగుపారు నన్నిదిశల

తే.గీ. అక్షయమ్మగు అక్షరయజ్ఞముగను
తెలుగునేలను దున్నియు తెలుగు విత్తు
నాటినంతనె మొలకెత్తి నాటి మొక్క
మేటి వృక్షమై నిలుచును ధాటిగాను ॥ 18

సీ. పసిపాప పలికెడు పసిడిపల్కులలోన
'అమ్మ'పదమునొల్కు అమృతమ్ము
వసపోసినట్లుగ వచ్చిరానివి ముద్దు
మాటలు వినిపించు మధురముగను
ఆటపాటలతోడ అలసిన బాలల
గారాబు సుద్దులు కడుపునింపు
గోముగా బిడ్డకు గోరుముద్దలు పెట్టు
తల్లిలాలింపులు నొలుకు మధువు

ఆ.వె. ఎట్టి భావమైన ఎదనుపట్టు తెలుగు
భాష పారిజాత పరిమళమ్మొ!
తెలుగు పలుకులోని తీపితెలిసినంత
మాటలాడు తెలుగు మక్కువగను ॥ 19



సీ. కృపజూప వేడుచు కృతులను తెలుగులో
పాడిన ప్రవహించు భక్తిరసము
ప్రియమార భాషించు ప్రేయసి పలుకులు
మకరందమును చిందు మనసు నందు
అలిగిన వేళల ఆ సత్యభామలా
కఠినోక్తులాడగ కలత చెందు
దూషణమ్ములు కూడ భూషణములనంగ
మధురభాషణములై మదిని నింపు

తే.గీ. వేషమును జూసి కొందరుఁ భాషజూసి
కొందరు ప్రభావితులగుచు నుందురనగ
వేషభాషల సంస్కృతి వెల్లివిరియ
స్వాగతింతురు సర్వులు సాదరమ్ము ॥ 20

సీ. ప్రాచీనకవులంత పాండిత్యమును జూపి
రచనలు చేయగ రమ్యముగను
ఆధునిక కవులు ఆదర్శప్రాయమౌ
రచనల నావిష్కరించుచుండె
తెలుగు సాహిత్యపు వెలుగుల ధన్యులై
నారు రచయితలు నాడు-నేడు
మస్తకమ్మును నింపు పుస్తకమ్మునెపుడు
శ్రద్ధగ చదివిన జ్ఞానమలరు

తే.గీ. మనిషి సంస్కార వంతుడై మనగ మేలు
మాతృభాషపై మమకార మనగ చాలు
జన్మసార్థకమైనట్టి చదువు వీలు
సంఘ సంస్కరణలు కోరి సలుప మేలు ॥ 21

సీ. జాతికి జీవనజ్యోతి యగుచు భాష
వెలుగుబాటను జూపి వెలితి దీర్చు
ఆప్తముగను మాటలాడ ససంకల్ప
ముగవచ్చి మనభాష ముదము గూర్చు
మోదము ఖేదము ఏది తెలుపనైన
మాతృభాషయె శీఘ్రగతిని వచ్చు
పరదేశమేగినా పట్టి గుర్తింపును
తెచ్చునదియె మన తెలుగుభాష

తే.గీ. కట్టుబొట్టును గూర్చును కనులకింపు
తెలుగువారి పండుగలను తెలియజేయు
సంస్కృతియు సంప్రదాయముల్ సంస్కరించి
ఉన్నతుని జేయు మనిషిని ఉత్తమముగ 22

సీ. భాషాభివృద్ధికి బహువిధమ్ములుగను
సాహితీ సంస్థలు సహకరించు
వివిధ ప్రక్రియలలో కవులలో పోటీలు
నిర్వహించగ మంచి నేర్పు వచ్చు
సామర్థ్యమును చూప సహజరీతి కవుల
సృజనాత్మకశక్తి పెచ్చుపెరుగు

తే.గీ. గ్రంథపఠనమ్ము నాసక్తి కలుగజేయ
పొత్తము లధికసంఖ్యను పొందుపరచి
చదివినంతనె యందరు శ్రద్ధతోడ
కలుగ శుభ పరిణామము తెలుగు వెలుగు 23

సీ. పుస్తకమ్మిక మంచి నేస్తమై స్వాంతన
కలిగించు మానసికముగ మనకు
చీకటులను బాపు చిరుదివ్వెవలె నిడు
జ్ఞానమనెడు కాంతి జగతి మనకు



రచనయందాసక్తి రగులజేయుచు పొత్త
మగును మన కిలను మార్గదర్శి
వృత్తియేదైన ప్రవృత్తి నుత్తమరీతి
మలచును పొత్తము మనల నిజము

తే.గీ. అక్షయమగు పాత్రలగు నీయక్షరములు
లక్షలాది పుస్తకములు లక్షణముగ
అందజేయును జ్ఞానసంపదను విధిగ
చదివిన కొలది పెరుగుట తథ్య మనగ 24

సీ. తెలుగు భాషను పద్యముల యతీప్రాసలు
కవితామతల్లికి కాన్కలగును
మంచిపద్యమ్ములు మాతకర్పణజేయు
మల్లెమాలలనంగ జెల్లు మదిని
భాషలో నున్నట్టి పదములొక్కటియైన
ప్రతిపదార్థము వేరు పదములగును
భావపరంపరన్ పంచుచు రచనలు
వివిధ ప్రక్రియలను విన్నవింతు

తే.గీ. తెలుగుభాష వెలుగుదిశదిశలు నిండ
గద్య పద్యములు మినీకవితలు నవల
కథలు గేయాది రచనల కనక కుసుమ
రాశి భాషామతల్లి నర్చననుజేతు ॥ 25

తే.గీ. తెలుగు సంస్కృతిన్ తనువులు పులకరించ
తెలుగుభాషకు గుర్తింపు తెలుసుకొనగ
తెలుగు బిడ్డల కన్నుల వెలుగుచూసి
భరతమాతయు సంతోషభరిత యగును ॥ 26

ఆ.వె. గ్రాంథికమును, తెలుగు గ్రామీణభాషను
విలువ రచన చదువ తెలియు మనకు
ఏవిధమున నెవ్వరేమి చెప్పినగాని
కవిహృదయము నిల్చు కనులముందు ॥ 27

సీ. 'మా'యని తెలుగుపై మాయని మమతతో
పట్టు సాధించుట ప్రగతి యగును
వేచి చూడకముందె 'వేచి' కూరలు బెట్టు
అమ్మవంటి భాష కమ్మతనము
కాచిన నేతికై 'కాచి'న వారిలా
మంచి రచనలను కాంచనగును
ఈవల తెమ్మన ఈ'వల' తెమ్మను
అర్థము వచ్చుటె అద్భుతమ్ము.

తే.గీ. పదములకు కొన్ని నానార్థ పదములుండు
తెలుగునేర్చినవారికి తెలివి పెరుగు
తీయని నవనీతమువంటి తీయ నగుచు
మధురభావలహరి దేల్చు మాతృభాష ॥ 28

సీ. 'అమ్మ'యన్న పలుకు కమ్మగ వినిపించు
మమ్మీకి అర్థమే దమ్మ? కలదు?
'నాయన' పిలుపున 'నా'యనిపించును
డాడీ పిలుపులోన డాబు కలదు
అంతరంగమ్మున ఆప్యాయ మొలికెడు
అమ్మభాష పిలుపు అవసరమ్ము
మానవతాదృక్పథాన నడువనేర్ప
బాధ్యులు గురువులు, పెద్దలగును



తే.గీ. తెలుగు తల్లిముదమ్మున తేలియాడ
తెలివి కలిగిన మనమంత తెలుగుమాట
పలుకవలెను తెలుగుపాట పాడవలెను
తెలుగుతల్లికి జోహార్లు తెలుపుకొనుచు ॥ 29

సీ. మోహము మొత్తక నుండి మోహము కల్గించు
భాష తెలుగు మాతృభాష మనకు
సప్తస్వరమ్ములు సరిగమ పదనిల
తీయగ పలికెడు తెలుగు మనది
జోలపాటలు పాడి జోకొట్టు అమ్మలా
మైమరపించును అమ్మభాష
సాగరమున రత్నసంపద యున్నట్లు
మేలు గ్రంథములుండు తెలుగునందు

ఆ.వె. తినగ తినగ వేము తియ్యన అనిపించు
విధము అనగ నగ విధిగ తెలుగు
నేర్చుకొందు రింక నియమనిష్టలతోడ
కష్టమనుచు కూడ యిష్టపడుచు ॥ 30

ఉ. భావమెరుంగ జేయుటకు భాషయె ముఖ్యము మానవాళికిన్
దేవుని వేడుపల్కులును దీనుల బాధలు తీర్చ చెప్పెడున్
భావిని బాధ్యతల్ తెలిపి బాలల నేర్పుగ తీర్చిదిద్దుటన్
దీవెన లిచ్చువేళలను తేనెల నూరుతెలుంగు భాషయే ॥ 31

ఉ. భారతదేశమందు గల భాషలలోన తెలుంగు లెస్సగా
ధీరుడు రాయలప్పటికె తెచ్చెను పేరుప్రతిష్ట లంతటన్
మీరును, మేమటంచునిక మీనము మేషలెక్కచూడకన్
చేరిన నైకమత్యమున శీఘ్రము పట్టము కట్టుభాషకున్ ॥ 32

ఉ. పూలను తావియున్ మధువు పుష్టిగ నుండువిధమ్ము భాషయే
కాలము శాశ్వతమ్ముగను కానగవచ్చు సుధామయమ్ముగన్
మేలగు భాషగా తెలుగు మేదిని మెప్పును పొందమోదమున్
తేలును మానసమ్ములును తేలికనూయల లూగుచందమున్ 33

ఉ. కేకి, పికమ్ముల స్వరము కీరము పల్కులకంటే వారధిన్
ఆ కెరటమ్ముల ధ్వనియు, హాయగు తుమ్మెద పాటకంటెనూ
పాకిన మాధవీలతల బంగరు ప్రకృతి శోభకంటెనూ
లోకము నుత్తమంబగు తెలుంగు కవిత్వము ప్రీతిగొల్పునే 34

ఉ. ఆశయసిద్ధికై మనము ఆకలిదప్పులు విస్మరించియున్
లేశము బద్ధకించకనులేదు విరామ మటంచు చెప్పకన్
పాశుపతాస్త్రమంటిదను పట్టుదలన్ కృషిచేసినప్పుడే
ఆశలుతీరి కష్టమునకందును సత్ఫలితమ్ము తృప్తియున్ ॥ 35

ఉ. ఏరకమైన భాషలను యెంతగ నేర్చిన మాతృభాష నే
మారక ప్రేమతో తెలుగు మాధురిగ్రోలుచు మాటలాడుటే
పౌరుల లక్ష్యమైనపుడె పూర్తిగసాధ్యము నుద్యమించగన్
నీరదతుల్యమై కురియు నిత్యము తేటతెలుంగు వర్షమై 36

## సంస్కృతి

సీ. బాలసారెను చేసి బాగుగ నామక
రణము పిదప యన్నప్రాశనమును
క్లేశమునణచగ కేశఖండనజేయ
పద్ధతిగానుండి ఫలితముండు
ఐదవయేటను అక్షరాభ్యాసన
లక్షణమ్మందురు లక్షమంది



చిరుప్రాయులు స్థిరచిత్తులగుటకును
ఉపనయనముజేయ నుత్తమమ్ము
శాస్త్రీయ పద్ధతిన్ జరుపు శుభప్రదమౌ
కల్యాణ వేడుకల్ కనులవిందు

తే.గీ. మంగళకరమైనట్టి యా మంత్రములను
వేల్పులును పండితులును దీవించు హితులు
సాంప్రదాయముల్ పాటించి సంస్కృతులను
గౌరవించుటె కర్తవ్య పూరణమ్ము ॥ 37

సీ. ఆదర్శప్రాయమై ఆత్మీయభావమున్
సాంప్రదాయము లొప్పు సంస్కృతులును
జాతిప్రగతికి నీధాత్రి యాధారముల్
సర్వసౌభ్రాతృత్వ సాధనమున
జన్మసంస్కారమున్ చరితార్థతను జూపు
వాగ్గేయకారుల వాఙ్మయమ్ము
మనిషిలేకున్నను మాన్యచరిత్రయున్
ఆచంద్రతారార్క యశము నొందు

తే.గీ. దేవుని యెడల భక్తియు దేశభక్తి
కలిగి పెద్దల, గురువుల గౌరవించు
లక్షణములున్న వారు సలక్షణముగ
సత్ప్రవర్తనులై మహిన్ బ్రతుకగలరు 38

## తెలుగు భాషాభివందనం

సీ. వందనమానందమొంద విజయనామ
వినిపించు వినతిని వినగరమ్ము
పిల్లలకు మరియు పెద్దలకు తెలుగు
భాషపై మమతనూపట్టునిమ్ము

తెలుగును చక్కని తీరున వ్రాయుట
ప్రజలు శ్రద్ధను జూపు ప్రతిభనిమ్ము
తెలుగుభాషోద్యమ విలువలు పెంచుచు
భాషాసమాఖ్యకు బలమునిమ్ము

తే.గీ. తెలుగుభాషకు గుర్తింపు తెచ్చిపెట్టి
భవితకు నుగాది మధురిమ పంచవమ్మ!
ప్రతినబూని ప్రభుత్వము ప్రజలుకూడ
పాటుపడగను సాధించు భాగ్యమిమ్ము! 39

ఆ.వె. కృషిని చేయుచుండ భాషాభిమానులు
దిశదిశలకు బ్రాకు తెలుగు వెలుగు
విజయనామమన్న నిజమైన విజయమ్ము
అందజేయు సుమ్మ అందరికిని 40

తే.గీ. విజయనామాబ్ధి మ్రోగించు విజయభేరి
కోర్కెలన్నియు నెరవేరి కొరతలేక
సకల సౌఖ్యము లందగ చక్కగాను
అందుకొనుము శుభాకాంక్ష లక్షయముగ 41

తే.గీ. పిల్లగాలులు నుల్లము ఉల్లసిల్ల
శ్రావ్యమైన కోయిలగొంతు శ్రమనుదీర్చ
వేరురుచులన్ని మామిడి వేప పంచ
కొత్త వత్సర మలరించు చిత్తములను 42

సీ. ఆరోగ్యమే భాగ్యమంచు నెల్లరెరింగి
ఆరోగ్య సూత్రము లమలుపఱచి
ఉదయపు నడకను ఉత్సాహముగజేసి
ఉద్యోగబాధ్యత నుద్యమించి



మితభాషణమ్మును మితభోజనమ్మును
అమితశ్రద్ధగను ఆచరించి
వ్యాధినిరోధక పద్ధతుల్ టీకాలు
సూదిమందులు తీసుకొనుచుండి

తే.గీ. కలుషితోదకమును త్రాగక జనులంత
మంచినీటి శుద్ధినిక పాటించిత్రాగి
పరిసరమ్ములను పరిశుభ్రముగ నుంచి
ప్రతియొకరు పాటుపడినచో ఫలితముండు 43

సీ. వాతావరణమందు వరుస కాలుష్యమున్
నిర్మూలనము చేయ నిత్యవిధిగ
ప్రజల మేలును కోరి ప్రభుత సహకరించ
సాధ్యమౌను ప్రగతి సహజరీతి
పంచభూతమ్ముల పరిరక్షణగును
పాంచభౌతిక దేహ ప్రాణభిక్ష
దేశపురోభివృద్ధికి శక్తినిచ్చును
ఆరోగ్య విలువలె హార్దికముగ

తే.గీ. దురలవాట్లను నెట్టుచు దూరముగను
దేశప్రజలెల్ల ఆరోగ్యదిశను నడువ
అంగబలము నార్థికబల మంగరక్ష
కాగను ప్రపంచ ఆరోగ్య కలిమి కలుగు ॥ 44

సీ. తల్లిని మించిన దైవము లేదంచు
అమ్మభాష మనకు కమ్మనంటి
ఇంటను బయటను ఇంపుగ తెలుగును
మాటలాడినలేదు నష్టమంటి

తెలుగుపై నున్నట్టి తెలియనిప్రేమతో
చర్వితచర్వణ మరయ కుంటి
చెప్పగ చెప్పగ చెవుల కెక్కుననెడు
పేరాశ మదిలోన పెట్టుకొంటి

తే.గీ. పాఠశాలలో పిల్లలు, బాధ్యతగల
పెద్దలు పనిచేయుస్థలమందుకూడ
భాషపట్ల గౌరవభావముంచి
తెలుగు వ్రాసిన పలికిన కలుగు మేలు ॥ 45

తే.గీ. భాషపట్లను గౌరవభావ మనక
కొందరు తెలుగు వెలుగును కోరుకొనరు
అట్టివారికి నభిరుచి యబ్బునటుల
పాటుపడవలె నెల్లరు పట్టువిడక 46

సీ. నేనొక పాపాయి నైనచో తెలుగును
ముద్దుముద్దుగ పల్కి సద్దుచేతు
నేనొక యువతిని ఐనచో తెలుగును
మన్నించు భర్తను యెన్నుకొందు
నేనొక తల్లిని ఐనచో తెలుగును
నేర్పి బిడ్డలజేతు నిపుణులుగను
నేనొక తండ్రిని ఐనచో తెలుగన్న
ప్రేమను పెంచుదు పిల్లలందు
నేనొక గురువునే ఐనచో తెలుగును
బోధింతు పిల్లల బుద్ధి పెరుగ



తే.గీ. భావి పౌరులైనట్టి యాబాలలంత
నేర్చుకొనవలె తెలుగును నేర్పుగాను
జీవనోపాధి కొఱకు నేర్చిన నితరము
నేను మాత్రము విడువంగబోను తెలుగు ॥ 47

సీ. బ్రతికించుకొనవలె భాషను మనమంత
బాంధవ్యబంధమున్ బాధ్యతగను
ఎవరిభాషను వారు ఎంతయో శ్రద్ధతో
మరువక నేర్చిన మనును భాష
విశ్వభాషలలోన వినుతికెక్కిన తెల్గు
చూడచక్కని లిపి శోభ నలరు
అందరు మెచ్చుచు అనువుగ వ్రాయగ
సులభశైలికలది తెలుగులిపియె

తే.గీ. తెలుగు నున్నవి, కన్నవి తెలుపుచుండ
చింతయను చీకటి తొలగి వింత గొలుపు
జ్ఞానమనెడు వెలుగువచ్చు గాన చదివి
తెలుసుకొన్న మేలుకలుగు తెలుగుభాష 48

సీ. తెలుగులోనున్నట్టి దివ్యచరితములు
పూర్వవైభవమును బోధపరచు
మనభాషఛందస్సు మనసునకూరట
మేధోమథనమన్న విధమునుండు
గ్రంథపఠన వల్ల కలుగు పరేంగిత
జ్ఞానము పెరుగు విజ్ఞానసుధయు
చిత్తము హత్తగ పొత్తము చదివిన
భావతరంగిణి పరగుమదిని

తే.గీ. చదువనేర్చిన వ్రాయనేర్చగను వచ్చు
తెలుగుభాషయే వర్షమై తెలుగునేల
కురియ తరులు రచనలను విరులనొప్పు
నవనవోన్మేషమౌ నందనవన మనగ ॥ 49

తే.గీ. తెలుగు భాష సుధనుగ్రోల తెలియదగును
తేటగీతి యాటవెలది ద్విపదలందు
తెలుగు భాష తీయదనము తెలియుచుండు
వెలుగు నిడు దివ్వె యేమన తెలుగుతల్లి ॥ 50

తే.గీ. తల్లిదండ్రులు నేర్చిన పిల్లలంత
తెలుగు భాషాభిమానులై నిలువగలరు
ఎల్లలను దాటివెళ్ళినా ఎదనువారు
మాతృభాషను మన్నించ మరువలేరు ॥ 51

తే.గీ. తెలుగు ప్రజలంత తీవ్రమ్ము దీక్షబూని
తెలుగు భాషను ఘనతను తెచ్చిపెట్టి
తెలుగు జాతిగౌరవమును నిలిపినపుడె
తృప్తిపొందును మనసార తెలుగుతల్లి ॥ 52

## సంస్కృతి

ఉ. భారతదేశ వాసులదె భాగ్యము శోభను గూర్చు సంస్కృతిన్
మారుచుపోవు కాలమున మారని పద్ధతులే ఘనమ్ముగున్
నీరును పాలు బోలినది నెయ్యమై హైందవధర్మమన్నయా
సారమెరుంగుటే మనకు చాలును సార్థకమౌను జన్మయున్ 53

ఉ. దేశము సంద్రమై నదులతీరున సంస్కృతి సాంప్రదాయముల్
లేశము భేదమన్నదియు లేక విలీనము నొందుచుండగా
ఆశయసిద్ధి కోరుచును ఆపద బాయునటంచునెంచి తా
మాశగ నాచరించుదురు మానవులందరు నమ్మకమ్ముతో॥ 54



ఉ. మంగళ సూత్రధారణను మానిని కంఠమలంకరించగన్
మంగళవాద్యముల్ మరియు మంత్రములంతట మారుమ్రోగగా
చెంగున యావధూవరులచే తలబ్రాలను సందడిన్గనన్
నింగిని తాకు సంబరము నేలనుచూపును నేత్రపర్వమై ॥ 55

ఉ. ముచ్చటగొల్పు తోరణము ముంగిట ముగ్గులు ధర్మపత్నితా
వచ్చిన నవ్వుమూనెదరు వాడుక తప్పక పూజచేయుచూ
తెచ్చిన హారతిన్ మరియు దివ్యప్రసాదము భక్తిశ్రద్ధలన్
ఇచ్చిన సాధ్యమౌనె? యికయేరికినైనను మెచ్చకుండగన్ 56

ఉ. శాంతిఅహింసలే మనదు సంస్కృతియైన పరోపకారమే
ఖ్యాతినొసంగునట్టి ఘనకార్యమదెల్లరు నాచరించవి
భ్రాంతిగ తృప్తికల్గుటయు పావన భారతదేశ ధర్మమే!
నీతినిజాయితీలె మన నీడగ నిల్పును జాతియున్నతిన్ ॥ 57

ఉ. సొంపగు సాంప్రదాయములు చొప్పడు హైందవ సంస్కృతిన్గనన్
ఇంపుగ తోచుగాదె! యిలనేరికినైన? విదేశవాసులున్
సంపదకన్న మించినది సంస్కృతి యంచని మెచ్చుచుండపూ
జింపనగున్ సదా! ఘనవశీకరణమ్మగు శాస్త్రమెల్లరున్ ॥ 58

## పండుగలు - సంక్రాంతి

సీ. సంక్రాంతి పండుగ సంరంభములుగన్న
తెలుగు సంస్కృతి తేటతెల్లమగును
మకర సంక్రమణము మామిడి తోరణ
మ్ములును గొబ్బిళ్ళతో ముగ్గు లమరు
సన్నాయిపాటతో సరిగంగిరెద్దాట
సరదాల సరిగమల్ సాగుచుండు
భోగిమంటలేసి భోగిపళ్ళనుపోసి
పిల్లలు పెద్దలూ ప్రీతినలరు

బొమ్మల కొలువులో కొమ్మలందరుగూడి
కొత్త కోకల వెల కోరి యడుగు
పిల్లలందరు జేయు పిండివంటలదాడి
కొత్తబట్టలు కట్టి కొసరుచుండు
సాతాని జియ్యరు చక్కని గీతాలు
తాళాలు తప్పెట్లు తరలుచుండు
కొత్త యల్లునిరాక కొంగుబంగారమై
ఇల్లంత సందడి యినుమడించు
ఇంటికి చేరగ పంటలు సంక్రాంతి
లక్ష్మియై సాక్షాత్కార లబ్ధి జరుగు

తే.గీ. పండుగ జరుగు పల్లెల నిండుతనము
ప్రకృతిశోభయు సహజసంపదలు కనుల
పంట ఆదినుండియు ప్రతియింట జరుగు
వేడుకల నిండు పరమార్థముండు నిజము 59

**ఉగాది**

సీ. నవ్వుచు నరుదెంచు నవవసంతము శోభ
ప్రకృతింగని జనులు పరవశించు
పచ్చని చెట్లను పంచమస్వరమున్
పికగళమాధురి ప్రీతినుండు
చల్లని గాలులు పుల్లని మామిడి
ఎల్లర మనసులు కొల్లగొట్టు
నుడువు నుగాది పచ్చడి జీవితంబన్న
కష్టసుఖమ్ముల కలయికంచు
చేదుగురుతులను చెరపి భావిని మన
తీపికోర్కెలు తీర్చు తిథియుగాది



తే.గీ. చూతవృక్షము లుండును చూచుటకును
నిండు చూలాళ్ళ వోలెను నిండుగాను
వేపపూతయు చెట్లను విరగబూయ
వివిధ వర్ణముల్ వికసించు విరుల వెన్నొ 60

తే.గీ. పండుగ తెలుగు వారంత నిండు మనసు
ఆ వసంతలక్ష్మిని గొల్చు దైవమంచు
జాతి సంస్కృతి నల్దెసల్ చాటునటుల
కోరి నిర్వహించు కవితాఘోష్టులలరు 61

కం. కోయిల మహదానందము
హాయిగ మావిచిగురంత ఆమనివేళన్
మేయుచు మధురగళరవమున
కూయును 'కూ'యనగ తిరిగి 'కూ''కూ' యనుచున్ 62

సీ. సిరులను చిందించు చిరునవ్వు కననొప్పు
పిల్లతెమ్మెరవచ్చి పిలిచినటుల
పలుకులుండును మనసు పులకింప జేయుచు
తొలకరి జల్లులా తోచునటుల
పిల్లల సందడి ప్రీతిగ మురిపించు
కడలితరంగ సవ్వడి యనంగ
అంతరంగమ్ములు ఆదర్శప్రాయమై
అభ్యుదయమునుండు ఆ గృహము

తే.గీ. తెలుగునాట యాయింటను తెలియాడు
ముదముగన్నంతనేరికిన్ ముచ్చటగును
పరులకు సహకరించు దంపతుల మెచ్చి
అందరును తలచును వారినాప్తముగను ॥ 63

సీ. వినువీధి జలదముల్ వింతగ మారును
మనిషి మార్చుకొనెడు మనసువోలె
మేఘమాలికలు పరుగిడుచందముగను
ఊహల నూయల నూగుమనసు
నింగిలోని మెరుపు భంగి యాలోచన
తళుకుమను తటిల్లతవలె తలను
వెల్లువై భావాలు వెల్లివిరియునంత
ఝల్లని కవియుల్ల ముల్లసిల్ల

తే.గీ. కలము పట్టుచు కవితను గళమువిప్పు
భావకవిత దుముకు పరవళ్ళుత్రొక్కి
రచనలు కలకాలము నిలిచిననాడు
కవికి జన్మసార్థకమౌనుకాదె యిలను ॥ 64

సీ. జీవశక్తిని తల్లి జీవితమ్మునిడును
బుద్ధిశక్తిని భాష పూర్ణముగను
వాఙ్మయమ్ములలోన వాసిగన్న తెలుగు
మనభాష గర్వకారణము మనకు
తొలుత నంతర్జాల తెలుగుప్రవేశమ్మె
ప్రగతిని సూచించు పథకమగును
నేర్చి తెలుగుభాష నేర్పుగనుపయోగ
పరచిన నుండు లాభములు మెండు

తే.గీ. భాష గుర్తింపు పొందగ ప్రజలు ప్రభుత
ప్రథమ కర్తవ్యముగ నెంచి శ్రద్ధ జూప
వేదములు సహితమ్మును వెలుగుజూడు
ఉద్యమపురోభివృద్ధియు నుద్భవించు 65



తే.గీ. అవని ఆమని రాకతో అందమొలుకు
మాధవునిబోలు ధవుగోరి వధువు నవ్య
శోభ నెదురుతెన్నులు చూచునటుల
తోచు శుభలక్షణమ్ములె దోచుమదిని 66

సీ. విద్యాలయము విశ్వవిద్యాలయ
బోధన తెలుగును ప్రోత్సహించ
పద్యమందాసక్తి నధ్యయనముజేయ
ఎదుగుచుండును భాష ఎదల నిండ
తెలుగు సాహిత్యవిలువలు సత్త్వము
పద్యములు స్పష్టపరచుచుండు
ఛందస్సు కూడిన పద్యముల్ పెద్దలు
జాతి సంస్కార సంగీతమనిరి

తే.గీ. గద్య గేయమ్ములు వచన కవితలందు
తెలుగు భాష పాటవమును తెలియవచ్చు
వివిధ ప్రక్రియలను జూపు విధిగ మధుర
భావముల నొప్పును తెలుగు భాష యొకటె ॥ 67

తే.గీ. దైవదర్శనముంజేసి నవయుగాది
తొలుత పంచాంగ శ్రవణ ఫలిత మరసి
భావిసుఖమయ జీవన పయనమునకు
నిర్ణయములు నిర్భయముగ నిశ్చయించు ॥ 68

సీ. అలతి పదమ్ముల నద్భుతమగు భావ
ధారను రచనలాదర్శమగును
పద్యము, గేయము గద్యమైన వచన
కవితలైన తెలుగు ఘనత చాటు

భావవాహికమైన భాషను మనమంత
        మాటలాడవలెను మనసుపెట్టి
చదువు సంస్కార మతులితరీతిని
        అలవడ మనుగడ సులభమగును

తే.గీ. చల్ల చిలికి వెన్నను తీయు చందమునను
తెలుగనెడు పాలసంద్రమున్ చిలికి తీయ
గలరు యెనలేని సాహిత్యకలిమి సుధను
లలితకళలను సహితము లక్షణముగ 69

## దీపావళి

సీ. దీపావళియగును దివ్యపర్వదినము
        హిందువులానంద మొందు దినము
పిల్లలు పెద్దలు ప్రీతిగ జేసెడి
        పండుగ కన్నుల పండుగౌను
దీపాల వరుసల్లె ఆబాలవదనాలు
        కలకల లాడుచు కాంతులీను
సాంప్రదాయమ్మును చక్కగ పాటించు
        సంతోషకరమైన సంస్కృతియగు

తే.గీ. నాటి నరకాసురుని వధ నేటికెన్ని
మార్లు తలచినన్ కృష్ణావతార గాథ
సహకరించిన సతి సత్య సాహసమును
నవ్యదీపావళిగ తోచు నమ్మకమున ॥ 70

సీ. ముత్యాలు రాల్చుచు ముచ్చటైన మతాబు
        లాపిల్లల నగవులవలె నొప్పు
చిటపటలాడుచు సీమటపాకాయ
        లాపిల్లల అరపులవలెనొప్పు



చివ్వమని విరజిమ్ము చిచ్చుబుడ్లును పిల్ల
        లుఉత్సాహమన నొప్పు ఉత్సవమున
తారకలను తాకు తానం చెగురు జువ్వ
        లును వారి యాశయాలువలె నొప్పు

తే.గీ. చెంత కాకరపూవొత్తిచేత విష్ణు
చక్రమును భూమిపైన భూచక్రములను
ఒక్కసారిగ వెలిగించ నక్కజమ్మె
పిల్లలకు ముచ్చటయె ముద్దు పెద్దలకును ॥ 71

## దసరా

సీ. మహిషాసురుని దేవి మర్దించిన దినము
        విజయదశమి యని వినుతి నొందె
దసరాల సరదాలు దశమి వేడుకలతో
        ప్రజల నుత్సాహమ్ము ప్రజ్వరిల్లు
పాఠశాలకునిచ్చు పదిరోజులశెలవుల్
        హాయిగ గడుపగ ఆటవిడుపు
పిల్లలు పప్పులూ బెల్లముల్ పంతుళ్ళు
        ఐదంటు వరహాలు అడుగ వచ్చు

తే.గీ. పల్లెసీమల నానాడు పిల్లలంత
విల్లునంబులు ధరియించి అల్లరిగను
ఊరుచుట్టివచ్చెడివారు ఉత్సవముగ
వెనుకబడిపోయె నిప్పుడా వేడుకలును ॥ 72

సీ. పులివేషముల పెద్దపులులల్లె నటియించి
        అందింతురు వినోదమందముగను
నవరాత్రులు జరుప నవయలంకరణలన్
        దేవిపూజకును పందిళ్ళువేసి

సృజనాత్మకతశక్తి చూప పిల్లలచేత
బొమ్మలకొలువుంచు అమ్మలంత
ధరియించి నూతన వస్త్రముల్ చక్కగ
ప్రజలు దుర్గనుజేయు పూజలెన్నొ
హైందవ సాంప్రదాయంబులుండు పురాణ
పరమైన విశ్వాస బలమువలన

తే.గీ. నమ్మికొలిచినవారికి వమ్ముకాదు
కరుణచూపును మనపైన కనకదుర్గ
నిండువేడుకగ దసరా పండుగలను
జరుపుకొనుటవాడుకగను మారె మనకు ॥ 73

తే.గీ. క్రొత్తబట్టలు కట్టి క్రొంగొత్త పిండి
వంటలు తినుచు పిల్లలింటింట తిరుగు
వారి సందడి గని పెద్దవారు మనసు
తీర మురియుచు నందించు దీవెనలను 74

సీ. తెలుగుభాషా సాంస్కృతిక వికాసాబ్దిగా
ప్రస్తుత వర్షమున్ ప్రస్తుతించె
విజయనామాబ్దిని విజయమ్ము సిద్ధించ
చిత్తశుద్ధిని కృషి చేయ లబ్ధి
పాలన బోధన భాషగా తెలుగుపై
ప్రత్యేకశ్రద్ధ చూపంగ నగును
తెలుగుభాష ఘనకీర్తికిరీటముదాల్చ
ఆంధ్రమాతకు కల్గు సంతసమ్ము



తే.గీ. భావి భారత పౌరులు బాధ్యతగను
మనము మన భాషయంచను మమత చూప
తనను బిడ్డలు మరువలేదనుచు తలచి
తెలుగు తల్లి మానసమును తేలికగును ॥ 75

కం. అందుకొనుము నీకివె మా
వందనములు నవవసంత వరదాయిని యా
నందమును పంచుమమ్మ
అందరి నొకటిగనె చూచి యాదరమొప్పన్ ॥ 76

సీ. పదిహేనవ శతాబ్ది పలికె 'కోంటి' ఇటలీ
వాసి తెలుగజంత భాష యనుచు
ఆ విదేశీయులు 'హాల్డేను, బ్రౌనులు
తెలుగు గొప్పతనము తెలిపిరపుడె
తెలుగు నుచ్చారణ సౌలభ్యమున్ శబ్ద
మాధుర్యముండుట మనకు వరము
మన భాషను మనము మన్నించ సహజము
పరమ సంతోషము పరులు పొగడ

తే.గీ. ఆ పరాసులు సహితమున్ అచ్చ తెలుగు
అభ్యసించి భాషనుగల అందమంత
భావ విస్తృతిలోని ప్రభావమనిరి
తెలుగు మంత్రాంగమేర్పడి తెలియజేయు
భాషఔన్నత్యమును భావప్రకటనలను ॥ 77

## ఆచారములు

సీ. హైందవ సాంప్రదాయమ్ముల ప్రతితిథీ
పండుగై భాసిల్లు ప్రజల కెపుడు
ప్రకృతి యారాధన ప్రజలంత నమ్ముచు
చెట్టును పుట్టను చేరికొలుచు

అశ్వత్థవృక్షమున్ ఆ తులసీచెట్టు
చుట్టు ప్రదక్షిణల్ చుట్టుచుంద్రు
పుట్టలో పాలను పోసి పూజింతురు
నాగులచవితంచు నాగులకును
రథసప్త మనుచు సూర్యభగవాను కొలిచి
పౌర్ణమిని కొలుచు పూర్ణచంద్రు

తే.గీ. అష్టమి, నవమి లనగ శ్రీకృష్ణరామ
జన్మదినములై దశమి విజయదశమగు
భీష్మయేకాదశిని యుపవాసములును
పూజలు చేయుచుందురు పూర్ణముగను 78

సీ. ద్వాదశి క్షీరాబ్ధి ద్వాదశిగ యుసిరి
చెట్టుకు పూజలు చేయుచుంద్రు
కార్తీక పౌర్ణమి కమ్మని చలిమిడి
నైవేద్యముగ చంద్రుని కిడుచుంద్రు
శని త్రయోదశిగను శనిగ్రహపూజలు
నరకచతుర్దశి నరయుచుంద్రు
అయ్యమావాస్యను ఆనంద దీపావ
ళీయని పండుగ చేయుచుంద్రు

తే.గీ. ముఖ్యమైన తిథులలోన ముఖ్యమైన
పండుగలు ముచ్చటగొలుపుచుండనెపుడు
చేయుటే సదాచారమ్ము! చింతలేక
బ్రతుకు సాగుటకును మంచి సాధనమ్ము ॥ 79

సీ. గంగమ్మ తల్లికి కరములు జోడింతు
మంద్రగీతి వినుచు మందగతిని
మలయానిలమ్మును మరిమరి పొగడుదు
సడిచేయ సంగీత సౌరభముల



అమ్మమాటలలోన అనురాగ 'మనురాగ'
మతిశయిల్ల పరవశింతు నెపుడు
బిడ్డ 'లమ్మా'యను పిలుపు వీణానాద
మై వినిపించి మైమరచుచుందు

ఆ.వె. మనసు పులకరించు మమతలకోవెలై
తెలుగుతల్లి నందు నిలుపుకొనిన
తేనెలూరునట్టి తెలుగుభాషను జాతి
విడువకున్న మేలు విధిగ కలుగు 80

సీ. విస్తృతభావమున్ విశ్లేషణాసౌక
ర్యముకల మనభాష రమ్యమగును
తెలుగు పద్యమున యతీప్రాసనియమాలు
సొంపగు ఛందస్సు శోభగూర్చు
ప్రతిపద నానార్థప్రత్యేకత తెలుగు
భాషకు గలయట్టి ప్రాభవమ్ము
'షష్టిపూర్తి'కి నిండు సరిగ నరువదేండ్లు
'షష్ఠి' పూర్తికి నిండు నరిగనారు

తే.గీ. ఒత్తు యొక్కటే భేదము మొత్తముగను
అర్థమును మార్చినటులనె అర్థమునకు
ధనము సగమను రెండుయర్థమ్ములుండు
ఇట్లనేక రీతులనొప్పు తెలుగుభాష 81
అందమును చాటుశక్తిని పొందగలన?

సీ॥ అంకురార్పణజేసి రానాడె గురజాడ
నూతనకావ్యభాష తెలుగంచు
వ్యవహారభాషను వర్తింపజేయుచు
సాగించె రచనలు సార్థకముగ

చిత్తశుద్ధిని రచయితలు తెలుగు వ్రాయ
భాషోద్ధరణ యింక భారమగునె?
రచన నాంగ్లపదముల్ వ్రాయకుండుటకును
పాత్రికేయుల పాత్ర ప్రముఖమగును

తే.గీ. తెలుగు నేర్చినంత మనకు తెలియవచ్చు
సులభగ్రాహ్యమౌ పదముల సొంపుఁ భాష
తేనెలొలుకు పలుకులలో తీయదనము
మధురభావనమును ప్రీతి మనకు పెంచు ॥ 82

సీ॥ భాషకు క్షేమమె దేశము క్షేమము
భాషను సేవింతు ప్రణతు లిడుచు
మాతృభాష తెలుగు మనయింటి వెలుగని
కాపాడుకొనవలె కష్టమైన
మాటలాడుటె కాదు మరి వ్రాసి చదువగ
నేర్చిన మేలగు నేరికైన
ప్రోత్సాహమందించ పోరి ప్రభుత్వమున్
ఉద్యోగముల్ పొంద నుద్యమించు

తే.గీ. కొన్ని యితరదేశములల్లె కోరి మనము
తెలుగు నధికార భాషగా తెచ్చుకొనియు
పాలనా విధానము కూడ సులభముగ
పరుగులెట్టును విధిగ ప్రగతి పథము 83

తే.గీ. తెలుగు భావితరమునకు తెలియకున్న
కష్టపడి వ్రాసిన రచన లిష్టపడుచు
చదువువారును కొరవడి నంత కవులు
కుందు తెలుగుతల్లియు కుందుగాదె ॥ 84



సీ. పరుగిడు కాలము ప్రవహించు నదియైన
గతము త్వరితగతి కలసిపోవు
ప్రజలంత తమ తమ ప్రతిభ ప్రదర్శించి
పాలనా యంత్రాంగ ప్రగతిజూపు
జయజయధ్వనులతో జనత కేరింతలే
కోయిలగొంతులై హాయిగొలుపు
నవ్యత నాశించు యువత మల్లియలైన
స్నేహసౌరభమును సిరులజల్లు

తే.గీ. మాటయును బాటయొకటైన చోటె జయము
కులమతద్వేషములులేక కుటిలరాజ
కీయ మనక తెలుగుభాషకి మనమంత
పట్టమును కట్టవలెనింక పట్టుదలగ 85

## వేసవి కాలం

తే.గీ. వేసవిని తాపము భరించ విసిగి మనము
శ్రీహరివలె పాలకడలి చేరగలమ?
శివుని వలె గంగ నెప్పుడు శిరముదాల్చ
సాధ్యమా? బ్రహ్మవలె పద్మమందు నుండ? 86

తే.గీ. మండుటెండల మాడుచు మనుజులంత
తాపమును కొంచెమైన సైపలేక
శీతలగదుల నెల్లరు చేరుచుండ
విద్యుదంతరాయము నుండె విరివిగాను 87

తే.గీ. సూర్యుడాగ్రహమ్ము ప్రజల జూచునటుల
తెలుగు గడ్డ యుడుకుచుండె తీవ్రముగను
నీలిమేఘము లరుదెంచి చల్లబరచ
వాయుదేవుడు తోడ్పడు వాన కురియ 88

సీ. తెలుగు తోటను మల్లె వెల్లి విరిసి పంచు
మేటి సుగంధము మిన్ను నంటు
తెలుగునాటను పండు తీయమామిడి రుచిన్
ఖండాంతరఖ్యాతి ఘనత నొందు
తెలుగు నేలను పంట కలుగు కనులపంట
యననొప్పు వరిపంట గణుతికెక్కు
తెలుగు భాష వినగ కలుగు వీనుల విందు
చక్కని సంగీత సరళి నుండు

తే.గీ. మల్లెల పరిమళమ్మును మామిడి రుచి
పచ్చతనమునలరు వరిపంట, తెలుగు
భాష వరుస నాసిక జిహ్వబాగుగాను
కనులు, వీనుల కొసగెడు కాన్కలగును 89

సీ. దూసుకుపోయింది నాసాకు మన తెల్గు
తేజము వ్యాపించ దిశదిశలకు
తెలుగువిద్యార్థులు తెలివితేటలు జూపె
ప్రగతిపథమున ప్రయోగములను
గుర్తింపు నొందగ నర్తించు హృదయుల
స్పందన తెలుగులో పలికిరంత
తల్లిదండ్రులు గురువులకు మించి తెలుగు
తల్లి యుప్పొంగె సంతసమునంత

తే.గీ. అవసరార్థము నేర్చిన ఆంగ్లభాష
మనసు సుఖదుఃఖముల నడుమ నలుగునెడ
మాతృభాషలో చెప్పిన మనకు కలుగు
తృప్తి అనుభవపూర్వక దీప్తియగును. 90



సీ. భాషనంతర్జాల భాగమున్ జేయగ
తెలుగుకు విస్తృతి కలుగునింక
పదిహేను ఖతులందుబాటులో నుంచగ
ఉపయోగపడుచుండె నుచితముగను
ఖతులకు పెట్టగ ఘనులపేర్లనియేమొ
తెలుగు వాడుక నేడు సులభమయ్యె
భాషకు చెందునుపకరణమ్ములు రూపు
దిద్ద తెలుగు విశ్వదీప్తినొందు

తే.గీ. తెలుగుభాషాభివృద్ధియు పలురకముల
జేయు పరిశోధనలతోడ శీఘ్రమగును
పాలనావ్యవహారముల్ తెలుగులోనె
సాగి అధికారభాషయై జనులనొప్పు 91

సీ. భాషాభిమానుల బంగరురచనలు
భారతీదేవి యాభరణములగు
వృత్తము లమరును మొత్తము తల్లికి
రత్నకిరీటమున్ రమ్యముగను
సీసములును కంఠసీమను మరకత
మణిహారములుగ నమరుచునుండు
ఆటవెలియును తేటగీతులమరి
కర్ణాభరణములై ఘనత నొప్పు
కందపద్యములున్ అందమొలుకు నలం
కారము లగుచుండు కరములకును

తే.గీ. వచన కవితలు కథలు నవలలు నమరు
అమ్మ నడుముకు వడ్డాణమై యనంగ
నాటకమ్ములు నానీలు నాసికాథ
రణము లంగుళులై వెల్గులీను తెలుగు 92

సీ. ప్రవహించు జీవనది విధాన తెలుగును
ప్రవహించు జనవాణి ప్రగతికొఱకు
ఇతరముల్ నదిలో మిళితమగు చందాన
పరభాషలు కలసి పొఱుచుండు
ఏదియేమైనను ఏది ముఖ్యమోయది
ఎరుగున్న మేలగు నెవరికైన
పరభాష నెవ్వరైన పలుక మెదడుచేరు
మాతృభాషను పల్క మనసుచేరు

తే.గీ. మనసుపెట్టి చేసినపని మనకు తృప్తి
చిత్తశుద్ధి కృషినిచేయ నుత్తమంబు
అధిగమించ తెలివి నవరోధములను
సత్ఫలితము లుండును సత్యసాధనకును ॥ 93

తే.గీ. సాహితీసేద్యముంజేసి జల్ల తెలుగు
కవితలను విత్తనమ్ములు కవులు కృషిని
మొలకలెత్తి యా చక్కని మొక్కలన్ని
బడసిన ప్రసంశలను వాన దడిసినంత
పెరిగి పుష్పించి ఫలియించి పేరు నిలుపు 94

**ఆదిత్య హృదయము**

సీ. ఆదిత్యహృదయము ఆరోగ్యదాయిని
నిశ్చింతనిచ్చును నిత్యపఠన
ప్రాగ్దిశన్ ప్రభవించు బాలార్కు భజియించ
దిగ్విజయమగును దినదినమ్ము
మధ్యాహ్న మార్తాండు భక్తితో వేడిన
మహిమనుజూపును మహినికృపను
సంధ్యాసమయమున సర్వారుణిమదాల్చి
దినకరుబింబము దీప్తినొందు



తే.గీ. పశ్చిమాద్రికి భానుడు పయనమగుచు
జనులకు విధినిర్వహణమ్ము సహజమనుచు
తెలిపి కర్తవ్యదీక్షను నిలువచూపు
ప్రాణికోటికి యర్కుడు బాంధవుండు 95

సీ. ఆదిత్యహృదయమ్మె ఆధ్యాత్మతత్త్వమ్ము
అలవడు మార్గమ్ము ఆదినుండి
సప్తాశ్వరథమేకచక్రగామి రవియె
కాలచక్రభ్రమణ కారకుండు
శ్వేతపద్మధరు డాశ్రిత జనమిత్రుండు
సూర్యదేవుడు సర్వశుభకరుండు
అజ్ఞానతిమిరమ్ము నణచివివేకమున్
సుప్రభాతమె రశ్మి చూపుమనకు

తే.గీ. పంచభూతములకు నిలప్రాణప్రదము
అప్రభాకరుండగుట మహాద్భుతమ్ము
విశ్వమానవకల్యాణ వైభవమ్ము
విస్తరించునా తేజము విశ్వమంత ॥ 96

సీ. ఆదిత్య హృదయ మహాత్మ్యము వివరించె
నాయగస్త్యమహర్షి ఆదరముగ
విజయము సాధించ వీలుగ బోధించె
శాస్త్రమనిని రామచంద్రునకును
తనబలమున్నను దైవబలముకోరి
పఠియించమనె యతిబాధ్యతగను
కోదండరాముని గురుదైవ భక్తికి
విజయముసిద్ధించె విధిగ నపుడు

తే.గీ. జగతి ప్రత్యక్షదైవము సకలజీవ
రాశికి యునికిపట్టగు రవినినమ్మి
కొలిచి సూర్యనమస్కారములను జేయ
ఆయురారోగ్యసంపద లమరుచుండు ॥ 97

సీ. అమెరికావాసులై ఆంధ్రులు కొందరు
తెలుగు పత్రికలట తెచ్చుచుండె
'మాబడి' యను మంచిమార్గమున్ పిల్లల
కు తెలుగు నేర్పుచు గురువులైరి
భారతావనిలోన బాలలు తెలుగును
విస్మరించుట గొప్ప వింతకాదె?
మనబడులందును మాతృభాషను నేర్ప
తెలుగుకు మనుగడ కలుగు నిజము

తే.గీ. యాజమాన్యము ధోరణి మార్చుకొనుచు
తెలుగు బోధించశ్రద్ధను కలుగజేయ
భావిభారత పౌరులు భాషనేర్చి
తెలుగు వ్రాయంగ చదువంగ మేలుకలుగు 98

సీ. తెలుగు జనము మారగలుగునేమోగాని
తెలుగుదనము మార దెపుడు కనగ
ప్రజల నాలుకలపై ప్రజలభాష తెలుగు
మాండలీకమ్ములై మరియు పలుకు
ఏప్రాంతమున యాస నెవరు మాట్లాడినా
పిల్లలంగని తెల్గుతల్లి మురియు
వారినోటను జారు వర్ణముల్ సువర్ణ
మైవాక్కు రత్నమై మైమరచును



తే.గీ. జానపద సాహితీ సంపదనగ నొప్పు
వెలుగునిడు మణిదీపమై తెలుగుభాష
తరతరమ్ములకు పదబంధములు పొరి
జాతసుమసుగంధమ్మున ఖ్యాతిగాంచు ॥ 99

సీ. మన మాతృభాషను మనసార పలికిన
మకరంద బంధురమ్మనగ జెల్లు
పరదేశవాసులు పట్టుదలగ నేర్వ
మనము నిర్లక్ష్యమున్ మనగ తగున?
పరభాష కంటెనెవ్వరికైననూ స్వభా
షనె పరిపూర్ణత సాధ్యమగును
తెలుగు వెలుగు నాల్గుదిక్కుల ప్రసరించ
ప్రతియొక్కరు కృషిసల్పవలె నింక

తే.గీ. పాఠశాలలో తన సహపాఠితోడ
మాతృభాష తెలుగులోన మాటలాడ
శిక్షవేసి యాంగ్లమ్మునె చెప్పమనుట
భావ్యమా? తల్లిదండ్రికి బాధకాద? 100

తే.గీ. తెలుగు సంస్కృతి మన యిండ్ల తేజరిల్ల
తెలుగు భాషకు గుర్తింపు దేశమంత
కలుగునాడు మన కనుల వెలుగు కనగ
తెలుగు తల్లికి మనసంత పులకరించు 101

తే.గీ. భావిభారత పౌరులు భరతమాత
ముద్దుబిడ్డలు సన్మార్గమున నడుచుచు
తెలుగు భాషాభిమానులై నిలిచినప్పుడె
తెలుగుతల్లి ముదమ్మున తేలియాడు. 102

సీ. దీక్షబూని రచనన్ తెలుగుతల్లికి పూజ
తులసిదళములతో సలుపుచుండ
తెలుగుతల్లికి కీర్తనలు పాడ మోహన
మురళి రవళియును మ్రోగుచుండ
కవులు తెలుగుభాష ఘనతను వర్ణించ
వెంకటరమణయే వెనుకనుండ
ఆదిత్యుడిల పెంచు సంద్రము శోభల్లె
తెలుగు సాహిత్యము వెలుగుచుండు

ఆ.వె. క్రమము తప్పకుండ క్రమశిక్షణను జేయు
కార్యక్రమములందు ఘనము తెలుగు
కనులు వీనులకును కళ్యాణవిందగున్
తెలుగు భాష నొలుకు తీయదనము.

తే.గీ. తెలుగుభాషాభిమానము కలిగినట్టి
తెలుగు ప్రజలకు మేలును తలచునట్టి
చెలిమి నెల్లరి తోడను మెలగునట్టి
వారికాయురారోగ్యముల్ వరము లగును ॥ 103

